చతుర్థ వర్షారంభ (కవితా) సంచిక

# గీతావాణి

37





నాల్గవ సంవత్సరము  మొదటి సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద.

గీతాసాహిత్యసేవాసమితి,
ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 జూలై 1954

# విషయసూచిక - జూలై '54.



## మావద్ద దొరకు గ్రంథములు.

1. శ్రీ గీతాతాత్పర్య ప్రదీపము — రచయిత: స్వామి శ్రీ రామకృష్ణ
   పుటలు 450 వెల రు. 1-8-0
2. భగవద్గీత మూలం — చిన్నసైజు వెల రు. 0-11-0

గీతాదర్శనము — భగవద్గీతా తత్వమును వివరించు అద్భుత గ్రంథము
పుటలు 630 వెల రు. 5-0-0

4. భగవద్గీతోపన్యాసములు (13 వ అధ్యాయము మాత్రము) 1-8-0
5. గీతాసంకీర్తనము 0-[illegible]-0
6. గీతాస్తోత్ర రత్నమాల — ఏడువందల శ్లోకములలోని గీతాతత్వార్థ మంతయు 225 స్తోత్రములలో యిముడ్చబడినది. 0-6-0

ప్రతులకు— మేనేజరు.

శ్రీ గీతావాణి కార్యాలయము, ఆళ్లగడ్డపోస్టు, కర్నూలుజిల్లా.

# " గీతా వాణి "

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు

గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్:

[illegible]

మేనేజర్:

స్వామి శ్రీ [illegible]

గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

---

సంవత్సరచందా 4–0–0. * విడి ప్రతిక 0–6–0

---

15th JULY 1954.

## చందాదారులకు సూచన.

రేపరుపై వ్రాసిన చిరునామాకును, ప్రస్తుతం మీ చిరునామాకును మార్పు ఉన్నట్లయిన, సరియైన మీ అడ్రెసును మాకు వెంటనే తెలియజేయండి. ఉత్తరములు వ్రాయునపుడు మీ చెందా నెంబరును తప్పక వ్రాయండి.

కార్యదర్శి,
గీతావాణి ఆఫీసు.



సంపుటి 4 ★ స్వస్తిశ్రీ జయ — ఆషాఢము. ★ సంచిక 1

# అమ్మా!

క॥ ఈ దుస్తర సంసారము
లోఁ దికమకపడుచు మోహలోలతఁ గర్త
వ్యాదరము లేదు; యిక నీ
పాదంబులె దిక్కు నాకు; భగవద్గీతా! ॥ ౧

శా॥ కాలంబంతయుఁజెల్లె వ్యర్థదురహంకారంబుతో నిక్కమౌ
మేలేదో యెఱుగంగలేక చెడితిన్, మిథ్యాభిమానంబదిం
కేలా! నిన్నె సమాశ్రయించితిని, నా యీ జీవితస్యందనం
బేలీలన్ నడిపింపఁజూచెదవొ నీ యిష్టంబు, యోగేశ్వరీ!॥ ౨

ఆ॥ వె॥ భక్తి నిన్ను గొల్చి పాపాత్ములైనను
అబలలైన వైశ్యులైన శూద్రు
లైన పరమసుగతి నందజాలుదురంచు
దలచి, దేవి! నిన్ను గొలుతు నెపుడు ॥ 3

చ॥ అలలవి యెంత గొప్పవగునైనను తామవియెంత పోరినన్
జలనిధిచెంతనున్న ఘనశైలము నింత కదల్పగల్గునే
చలనములేదు నీవిమల సారవిచారము లాకళించుకో
గలిగినవారి కమ్మరో! సుఖంబులు దుఃఖములెంత యేపినన్॥

చ॥ పరుసమునోకి లోహము సువర్ణము నైనటులన్ భవత్కృపా
భరితుని జేసి నాబ్రతుకు బంగరుపూవుగ జేయుమమ్మ! నీ
సరసమహోపదేశముల సారము నానుబె నావ్రతంబుగా
వరములొసంగుమమ్మ, భగవంతునివాఙ్మయమూర్తి! ఈశ్వరీ!

ఉ॥ దేహము నేను నాదనెడి దీనవిచారములంతరింప, హం
సోహమటన్న భావము విశోభితమై యలరార, భూరి సం
దేహతమంబు హృద్గగనదేశమునుండి తొలంగ, తల్లి! నీ
స్నేహమయార్ద్ర వీక్షణవిశేషము నాపయి గ్రుమ్మరింపవే॥ ఉ

శ్లో॥ వేదోదధిప్రమథనాత్
వాసుదేవసముద్ధృతం ।
సంతః పిబంతి సతతం
గీతామృతరసాయనమ్ ॥






[ గత సంచిక 11_వ పుట తరువాయి. ]



సచ్చిదానంద ఘనుడగు భగవంతుడు యేయేకాలములందు యేయేప్రయోజనములకై దేహమును ధరించి, సామాన్యనరులవలె వ్యవహరించును? అనెడివిషయము ముందటి శ్లోకమునుండి చెప్పబడుచున్నది.

నాల్గవ అధ్యాయము 7_వ శ్లోకమున భగవంతుని అవతారకాల నిరూపణము జరిగినది. ఈ శ్లోకమందు "యదా" యనెడి పదము రెండుమార్లు ప్రయోగింపబడినది. దాని యర్థమేమనిన – భగవంతుడవతరించుటకు యిదియె నిశ్చిత సమయమని నిష్కర్ష లేదు. ఈ యుగమున యీ సంవత్సరమున ఈ నెలయందు యీ దినమె అవతార మేర్పడుననికాని, ఒక్కయుగమున యిన్నియె అవతారములు సిద్ధించవలెననికాని, నియమము లేదు. ఈఅర్థమును సూచించుటకై "యదా యదా" యని ఒకేపదము రెండుపర్యాయములు ప్రయోగింపబడినది. ధర్మమునశించి అధర్మము పెరిగినపుడును, భగవంతు డావిర్భవింప దలంచినవుడును అవతారము సంభవించుచున్నది. ధార్మిక



వ్యక్తులపై – భగవద్భక్తులపై – సత్పురుషులపై, దుండగులయొక్క అత్యాచారములు ప్రబలినపుడు, ధర్మమునకు హానియు అధర్మమునకు వృద్ధియు నేర్పడును.

"అర్జునా! వేదోక్తమగు ప్రవృత్తి నివృత్తిరూప ధర్మమును కామనాపూర్వకముగ నొనర్చినచో అది స్వర్గాదిసుఖముల నొడగూర్చి, అభ్యుదయమునకు సాధనము కాగలదు. అదియె నిష్కామముతో నొనర్చినచో మోక్షరూపమగు నిశ్శ్రేయసమునకు సాధనము కాగలదు. మరియు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణములకును, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాసములనెడి ఆశ్రమములకును అనుకూలమైయుండి, వారు శ్రద్ధాభక్తులతో నొనర్చెడి అగ్నిహోత్రాది కర్మములను ప్రవృత్తి ధర్మమని చెప్పుదురు. పరస్త్రీగమనాది కృత్యముల నొనర్పకుండుట నివృత్తిధర్మమందురు. వేదనిషిద్ధమును, అనర్థదాయకమును, ధర్మవిరోధమునునగు అధర్మము పెంపొందినపుడు, ఈశ్వరుడనగు నేను నాకుతగిన దేహమును నిర్మించుకొని అవతరించుచున్నాను."

భగవంతుడవతరించుటకు తగిన సమయమును, ఆ అవతార ప్రయోజనమును మీదటి ఎనిమిదవ శ్లోకమున నిరూపింపబడుచున్నది.

అవతారము సిద్ధించుటకు మూడు హేతువులు ముఖ్యములు. (1) దుష్టశిక్షణము, (2) శిష్టరక్షణము, (3) ధర్మోద్ధరణము.

సదాచారమును జవదాటక, వేదవిహితమగు పుణ్యకర్మముల నాచరించుచు, చావుబ్రతుకుల సమస్యలో సైతము ధర్మమును విడువనొల్లనివారిని సాధుపురుషులందురు. సాధుసత్పురుషులను హింసించుటయె స్వభావముగాగల్గి వేదప్రతికూలమగు మార్గమునందు విచ్చలవిడి విహరించుచు పాపాచరణ పరాయణులైనవారె దుష్టులనబడుదురు. అట్టి దుష్టులను నిర్మూలించి, శిష్టులను పరిపాలించుటయే అవతార ప్రయోజనము.

ఈచోట నొక శంకకు ఆస్పదము కలదు. పరమ దయాళువగు భగవంతుడు దుష్టుల దుష్కృత్యములను క్షమించి, వారికి వివేకమొసంగి పరిశుద్ధులనుగ నొనర్చుటకు బదులు, వారిని సంహరించుట యెక్కడి న్యాయము? "పతితపావన సీతారాం" అనుచున్నారె; కాని 'పతిత ఘాతక' అనుటలేదే.

ఈ శంకకు సమాధాన మొసగవలసియున్నది. క్రియకంటె ఉద్దేశమునకు విలువ యెక్కువ ఆసురీ సంపదతోకూడిన పాపశరీరము యొక్క సంసర్గముతో శాశ్వత

ముగ అధోగతికి ఆలవాలము కాఁదగిన ఆ దుష్టులను సంహరించి, వారికి అపవిత్రశరీరములతోడి సంసర్గమును వదలించి భగవంతుడు పునీతుల జేయుచున్నాడు. స్వప్రయత్నమువలన యెన్నెన్ని జన్మములకైనను పునీతులు కానేరని ఆ పాపజీవులను తన అనుగ్రహప్రసాదముచే ఒక్క జన్మమందే పునీతుల నొనర్చుచున్నాడు. దీని కొక ఉదాహరణము జెప్పెదను. బాలుని కాలిపైననో, చేతిపైననో అసాధ్యమగు వ్రణము కల్గినచో, నానాచికిత్సలుజేసియు అది నయముకాని పక్షమున, తండ్రి వానికి శస్త్రచికిత్స చేయించి ఆ అంగమునుతీసివేయించును. ఆ అవయవము అట్లే ఉంచినచో ఆ విషవ్రణ ప్రభావముచేత తక్కినదేహమంతయు దూషితమై పోవచ్చును. ఆ విధమున శస్త్రచికిత్స చేయించుటలో తండ్రియొక్క దయాగుణమే ప్రకటముకాగలదు. అట్లే భగవంతుడు సైతము దుష్టులను సంస్కరించుటకు వలయు యత్నములు జేసియు వారు సంస్కారమును పొందజాలనియెడ, దండించి సంహరించి వారికి హితమునె చేకూర్చుచున్నాడు. ఎవ్వరి పూర్వసంచితకర్మము మంచిదైయున్నదో, ఏదో విశేష నిమిత్తమువలన — దుస్సాంగత్యమువలన దురాచారమున పాల్పడియున్నవానిని భగవంతుడు తానే వధించి వారిని ఉద్ధరించుచున్నాడు.

ధర్మసంస్థాపనమననేమి? శాస్త్రవిహితమగు ధర్మమునందు స్వయముగ తాను ప్రవర్తించుచు, ధర్మముయొక్క గొప్పతనమును ప్రకటించుటయేగాక, అశేష జనసముదాయముయొక్క హృదయమునకు హత్తుకొనునట్లు, ప్రభావవంతమగు వాణితో ధర్మోపదేశముల నొనర్చి, వేదశాస్త్రములయందును, దైవమునందును, పరలోకమునందును, మహాపురుషుల యందును వారికి శ్రద్ధకలుగునట్లును, వారు సదాచారనిష్ఠాసంపన్నులగునట్లును నొనర్చుట ధర్మస్థాపన మనబడును. ఈ కృత్యములచే ధర్మోద్ధారము జరుగగలదు.

భగవంతుడీవిధమున తాను దాల్చెడి దివ్యజన్మముయొక్క ఆవశ్యకతను గూర్చియు, దాని హేతు ఉద్దేశములను గూర్చియు ముచ్చటించి, ఆ తర్వాతి శ్లోకమునందు, జన్మకర్మములయొక్క దివ్యత్వమును, వాటినెఱుగుటచే కలుగు ఫలమును నుడువుచున్నాడు.

"అర్జునా ! నా జన్మకర్మములు స్వతంత్రమైనవి. వాటికి సత్త్వరజస్తమోగుణములయొక్క సంబంధము లేదు. నా జన్మము మాయాకార్యము; కావున సామాన్యులవలె సుఖదుఃఖములకు వివశమై యుండదు. నాకర్మముధర్మసంస్థాపనమునకేగాని స్వప్రయోజనముకొరకు గాదు. ఈ రహస్యములను వాస్తవముగ యెఱింగినవాడు తిరిగి పుట్టడు. వాడు నన్ను పొందగలడు."

భగవంతునియొక్క జన్మకర్మ రహస్యమును తెలిసికొనినవాడు పునర్జన్మమును బొందడను మాటకు అర్థమేమని శంకించవచ్చును. తమ ఆత్మరూపముగ భగవంతుని దర్శింపజాలెడి జ్ఞానులయెదుట యీ శంక నిస్సారమైనది. భగవత్పరమగు కర్మముల నొనర్చినవాడు చిత్తశుద్ధిని బొంది జ్ఞానదృష్టిని బడయగలడు. అట్టియెడ భగవంతుడు వానికి తన జన్మ కర్మములను ప్రసాదించుచున్నాడు. భగవంతునకు నిజముగ నెట్టి జన్మమునులేదు; యెట్టి కర్మమునులేదు. ఆతని జన్మములు మాయికములైనవని తెలిసికొని, "భగవంతుడే నాఆత్మ. కావున నాకును జన్మకర్మములులేవు." అనెడి నిశ్చయజ్ఞాన మేర్పడునట్లు భగవంతుడు భక్తుని అనుగ్రహించగలడు. ఈ జ్ఞానదృష్టిని బొంది శరీరము మాయామయమనెడి నిశ్చయ మేర్పడిన పిదప, మాయికమగు శరీరముతో ప్రవర్తించిన మాయికకర్మములవలన సత్యమగు దేహాంతరమెట్లు సంభవించగలదు. ఇట్టి జ్ఞానవంతుడు భగవత్సాయుజ్యమును పొందునేగాని, వేరొండు గతిని పొందడు.

ఇంతేకాదు; గతకాలమున ననేకులిట్టి జ్ఞానమునుబొంది భగవద్భావమును పడసియున్నారను విషయము ముందుశ్లోకమున వివరింపబడుచున్నది.

"అర్జునా! శబ్దాది విషయములనె చింతించెడి అజ్ఞానమానవులు ఆ విషయాకారమును బొంది తన్మయమై యుందురు. వారి వ్యవహారమునకువిషయములె ఆశ్రయములు. నిరంతర విషయచింతనముతో వారి అంతఃకరణము అపవిత్రమైనది. కావున వారికి విషయ సందర్శనమాత్రముననె రాగముదయించును. అది దొరకనిచో, దొరకి నశించుచో వాడు భయగ్రస్తుడగును. తన వాంఛితమునకు యెవడైన అడ్డమైనచో ఆగ్రహము బొందును. ఇట్లు

[మిగత 10-వ పుటలో]

ఓమ్.

# జహి శత్రుం … దురాసదః

'కథన కళాప్రపూర్ణ' పండిత నోముల అప్పారావు, కాకినాడ.



ఉ॥ అర్జునతోడ నిట్లనియె -
నా మధుసూదనుఁ డోయి ఫల్గునా!
దుర్జయమై రిపుమ్ము మదిఁ -
దోఁచిన లోభమదాదులందుఁ బా
పార్జనదీక్షితంబయి మ -
హాశనమై గురుసద్గుణౌఘ సం
మార్జనమైన కామమను -
మానసజాత వికారమెంతయున్.

మ॥ తనివింజెందఁగనీయ, దన్యధనముల్ - దారాదుల న్గోరఁగా
మనము న్బ్రేరణసేయు, నీచజనస - న్మానంబు సేయించు, స
జ్జనులన్ జుల్కనసేయఁగాఁ బనుచు, నా - శాపాశము న్బెంచు, శ
త్రునికాయంబు గడించుఁ గామమను శ - త్రుశ్రేష్ఠ మోయర్జునా!

చం॥ ఫలమును గోరకుండఁగ శు - భప్రదకర్మలు సేయబూనిన
ఫలమును గోరఁజేసి తగు - పాట్లుపడం బురిగొల్పుచుండుఁ గే
వల పరనిష్ఠులై వెలయు - వారలఁ గర్మవులందుముంచి సం
చలనమొనర్చుఁ గామమను - శత్రువరేణ్యము పాండునందనా!

మ॥ కవితాతత్త్వమెఱింగి శాస్త్రముల వ్యా - ఖ్యానించు సాహిత్యమున్
వివిధాఖ్యానవిశేషము ల్దెలియు స - ద్విద్వాంసుఁ గీల్బొమ్మఁగా
భువి నాడించు, ధనాఢ్యుఁ బేదవలెఁ బం - పున్బిచ్చమెత్తంగఁ, ద
త్త్వవిదు న్మూర్ఖునిఁ జేయుఁ, గామము మహో - ద్యద్వైరిసూవె సఖా

ఉ॥ మోక్షమొసంగు దేవునకు - మ్రొక్కుటలన్ మదిలోనఁ బుట్టి యా
మోక్షము గోరనీక ధన - పుత్రగృహాదులఁ గోరఁజేయు; ప్ర
త్యక్షవిరోధి కామమది - ధైర్యముతోడ వివేకఖడ్గమున్
దీక్షధరించి దానిని వ - ధించి ప్రశాంతిని గాంచుమర్జునా!

చం॥ రవికిరణాళిఁబుట్టు ఘన - రాజి రవిన్గనఁగప్పునట్లు చి
త్తవికృతిఁబుట్టు కామము ప - దంపడి జ్ఞానము గప్పుచుండుఁ ద
త్ప్రవిమలజ్ఞానదీప్తి సెడ - బంధకరంబగు మోహజాలముల్
ప్రవితతమౌను, వాని నెడఁ - బాపఁగ కామము ద్రుంచుమర్జునా!

ఉ॥ కామము పుట్టఁజేయుఁ గడఁ - కన్ రిపుకోటులనెల్లఁ గామసం
గ్రామమునందు నోడి రతి - కర్కశులైన మహీశులెందఱో
కామము గెల్చువారలె జ - గంబును గెల్చినవారు, శాంతిసు
శ్రీమహితాత్ములున్ గనుక - చెండుము కామవిరోధినర్జునా!

చం॥ ఎవని హృదబ్జపీఠమున - నించుక కోరిక సంచరింపదో
ఎవని సుకృత్యజాతము ఫ - లేచ్ఛనువీడి ప్రవృత్తినొందునో
ఎవనిని కామవైరి కను - లెత్తి కనుంగొనలేదో వాఁడె యీ
భువిని ఘనుండు. ధన్యతను - బొందుము కామము గెల్చి పాండవా.

[8-వ పుట శేషము.]

మూర్ఖజనులు విషయ తాదాత్మ్యమును బొందుదురు. అటుగాక, భగవంతుడనగు నన్ను ఆశ్రయించిన వారు రాగభయ క్రోధములనుండి విముక్తులై జ్ఞానతపస్సుతో భగవన్మయులై యుందురు."

"నీవానాడు సూర్యునకు జ్ఞానయోగము నేవిధమున బోధించితి" వని యడిగిన అర్జునుని ప్రశ్నను పురస్కరించుకొని దయామయుడగు భగవంతుడు తన అవతార జన్మ కర్మ రహస్యములను విస్తారముగ నుపదేశించెను. ఈ జ్ఞానమును బొంది కర్మముల నాచరించువారు విషయ బంధముల దగుల్కొనక భగవన్మయులై సాయుజ్యము నొందుదురు.

జనుల యొక్క భావానుసారముగ ఫలము నిచ్చుటతప్ప భగవంతుడనగు నాయందు విషమత్వము కాని, నిర్దయత్వముగాని లేదనెడి అభిప్రాయమును మీదటి పదునకొండవ శ్లోకమున భగవంతుడు శ్రీకృష్ణుడు వెల్లడించుచున్నాడు.

[signature]

# శ్రీ భగవద్గీత – పంచదశాధ్యాయము.

# పురుషోత్తమ ప్రాప్తియోగము.

అనువాదకుడు:— కల్లూరు ఓబుళరెడ్డి, బుసిరెడ్డిపల్లె, పాలగిరిపోస్టు.

[కవి యువకుడు. గర్భదరిద్రముతో చివికి జీర్ణించిన కుటుంబములో పుట్టి, ఎట్లో పూర్వసంస్కార బలమున స్వయంకృషితో విద్యావినయముల నార్జించి 'బడిపంతుల బ్రతుకు' బ్రతుకుచున్నాడు. 'దుర్బల్ కే బల్ రామ్' – అన్నట్లు భగవంతుడీతనికి అండయై జీవిత వికాసమును ప్రసాదించుగాక!

సామాన్యమగు కవిత్వపాండిత్యములతో భగవద్గీతనంతయు పద్యముల జేసినాడు. పదునేనవ అధ్యాయమును నివేదించి గీతావాణియొక్క ఆశీర్వాదమును బొంద కవి కుమారు డాకాంక్షించుచున్నాడు. —సం.]



గీ॥ స్కంధముం బైకి క్రిందికి శాఖలుగల ♦ భవమున నెడి యశ్వత్థ మవ్యయము గాగ
బలుకు, వేదాలు దేనికిం బర్ణములగు ♦ విజయ! యిది యెఱింగినవాడె వేదవేత్త. ౧

గీ॥ విషయము లిగుళ్లుగాగల్గి పెరిగి గుణము ♦ ల వలనను దానికొమ్మలు ప్రాకి, పైకి
క్రిందికిం బోయినవి. వ్రేళ్లు క్రిందికేగి ♦ మనుజజగతి కర్మములతో బెనగొనియెను. ౨

గీ॥ విజయ! దీనిరూపము గను..పబోదు ♦ యాదిమధ్యాంతములు దీని కరయ లేవు
పాదుకొన్న యీ అశ్వత్థ పాదపమును ♦ నరకవలయు వైరాగ్య తీక్ష్ణాసివలన. ౩

గీ॥ అవల యెవనివలన నీ యనాది సృష్టి ♦ చక్రముం ద్రిప్పబడునో యా స్వామి నాశ్ర
యించియుం బునరావృత్తి హీనమైన ♦ బ్రహ్మపదము నన్వేషింపవలెను, పార్థ! ౪

గీ॥ విజయ! నిర్మానమోహులు విజితసంగ ♦ దోషు లధ్యాత్మమున సదా తోగువారు
ముక్తకాములు ద్వంద్వవిముక్తులైన ♦ బుధులు యీ యవ్యయపదంబు బొందుచుండ్రు.

గీ॥ దేనినింబొంది ప్రాణులు తిరిగిరావో ♦ అదియె నా పరంధామము, యర్జునా! స్వ
యంప్రకాశమా దానిని సర్యచంద్ర ♦ పావకులు వెలిగింపనోపరు, కిరీటి! ౬

గీ॥ అర్జునా! నిత్యమైన నా యంశమే, మ ♦ నుజజగతిని జీవుండు నా నుడువబడుచు
ప్రకృతిలోని మనస్సు నారవది గాగ ♦ నున్న యింద్రియముల లాగుచున్నవాడు. ౭

గీ॥ తనువు కీశుండౌ జీవుడీతనువు దాల్చు ♦ నప్పుడుం వీడిపోయెడి నపుడు గాలి
పుష్పపరిమళముం గొనిపోవు భంగి ♦ నీడ్చుకొనిపోవుచుండు నా యింద్రియముల. ౮

కన్ను జర్మము ముక్కు నాల్కయును జెవియు ♦ ననెడి బాహ్యేంద్రియములను మనను నూత

గొనియు శబ్దాది విషయంబులను నతండు ♦ ననుభవించుచునున్నాడు, యనఘచరిత!! ౯

గీ॥ దేహమును వీడుచున్నను, దేహమందు ♦ నున్న గుణయుక్తుడై విషయోపభోగు

డైననుం మూఢులకును జీవాత్మ గోచ ♦ రింపదు, జ్ఞానులకు గోచరించు. పార్థ! ౧౦

గీ॥ అర్జునా! యోగులు ప్రయత్నమాచరించి ♦ నట్లయిన దమలోని జీవాత్మ గాంచ

గలరు, చిత్తశుద్ధి విరహితులగు జడులు ♦ జతనమొనరించియుం జూడజాలరయ్య.౧౧

గీ॥ అర్కునందుండి చంద్రునియందునుండి ♦ యగ్నియందుండి యేవెల్గు యఖిలలోక

ములను వెలిగించుచున్న దా వెలుగుయంత ♦ యున్న నాసొత్తె తెలియము. యోయి పార్థ! ౧౨

గీ॥ భూమియందు ప్రవేశించి భూతములను ♦ నా బలముచే ధరించుచున్నాను నేను

అమృతకరుడగు చంద్రుడనై సమస్త ♦ సస్యముల బెంచుచున్నాను. సవ్యసాచి!! ౧౩

గీ॥ భారత! జఠరాగ్ని స్వరూపంబుతోడ ♦ జీవుల శరీరములలో వసించి జీర్ణ

మును నొనర్తు ప్రాణాపానముల సహాయ ♦ మున జతుర్విధాహారము లనిశమేను. ౧౪

గీ॥ నేనెయున్నాను యందరి మానసముల ♦ యెరుకమరపులు నాచేత నేరుపడును

వేదవేద్యుడనేనెనూ వేదవేత్త ♦ నేనె, వేదాంతకర్తను నేనె. పార్థ! ౧౫

గీ॥ క్షరుడు నక్షరుడనియు లోకమున గలరు ♦ పురుషులిర్వురు, నాశమైపోవు సర్వ

భూతములును క్షరుడనియుం క్షీణమొంద ♦ నట్టిమాయను నక్షరుడందురయ్య. ౧౬

గీ॥ విజయ! యుత్తమపురుషుండు వీరికంటె ♦ నన్యుడు గలడాతని పరమాత్ముడంద్రు

తాల్చుచున్నాడు యీ జగత్త్రియముజొచ్చి ♦ అవ్యయుండగు యాప్రభు వమలచరిత!

గీ॥ క్షరమును నతిక్రమించి యక్షరప్రకృతికి ♦ హెచ్చుగా నుండుటంబట్టి, సచ్చరిత్ర!

వేదములు లోకతతులును పేరుకొనుచు ♦ నున్నవి నను సదా పురుషోత్తముడని. ౧౮

గీ॥ మూఢబుద్ధినివదలి నన్ మునుపు జెప్పి ♦ నట్లు పురుషోత్తమునిగాగ నరయువాడు

యన్నిటి నెఱుంగువాడయి నన్ను నెల్ల ♦ భంగుల భజించుచున్నాడు. భరతవీర!౧౯

గీ॥ అనఘ! పరమరహస్యమైనట్టి శాస్త్ర ♦ మును వచించితి నీకు దీనిని నెఱుంగు

నాతడే బుద్ధిమంతుడు యాతడే కృ ♦ తార్థుడగు గూడ నిట సందియంబు లేదు.౨౦

— కల్లూరు ఓబుళరెడ్డి.



# గీత — మనస.

కీ॥ శే॥ డాక్టరు రంగా చిన్నచలమయ్యగారు, చాగలమర్రి.



[దివంగతులగు శ్రీ రంగా చిన్నచలమయ్యగారు గేయకవిత్వమునందు ప్రామాణికమగు రచయితలు. వారిది నరకవిత్వము కాదు; వరకవిత్వము. మా గీతావాణికి వారు అభిమాన రచయితలు. ఇది వారు చివరిసారిగ వ్రాసియిచ్చిన రచన. వారి గీతా గానము ఆంధ్రదేశమున అద్భుతమగు పలుకుబడిని సంపాదించినది. దేవస్థానముల సంస్కారమును అభిలషించి "దేవాలయ"మను పత్రికను దాదాపు 8 నెలలనుండి నడపుచుండినారు. కుచేలునివంటి స్థితిలో కుబేరునివంటి ఉద్యమముల నెత్తుటలో వారికి వారెసాటి.

వారు గత మేనెల 17-వ తేదీ హృదయగతి నిరోధముతో హఠాన్మరణమునకు గురియైరి. వారి పవిత్రాత్మకు మా శ్రద్ధాంజలులు. వారి సంతానమునకు మా సానుభూతి. భగవంతుడు వారి కుటుంబమును రక్షించుగాక!

— సం॥]



1. ఆత్మతత్త్వంబు అందించు ♦ అమర జ్యోతి
జీవయాత్రకు ఆనంద ♦ సీమ జ్యోతి
భక్తి భావంబు వెదజల్లు ♦ భద్రజ్యోతి
మాతమనకెల్ల మంగళ ♦ గీత మనస.

2. రాగద్వేషంబు వేషంబు ♦ రాలిపోవ
కామక్రోధంబు లోభంబు ♦ గాలిపోవ
మాయ బంధంబు జన్మంబు ♦ మాసిపోవ
మాత పలుకెల్ల రతనాలు ♦ గీత మనస.

3. శాంతి సత్యంబు సౌఖ్యంబు ♦ చాలనిచ్చు
దానధర్మాల చింతన ♦ దాటినిచ్చు
వేదవిజ్ఞాన విద్యను ♦ వేడ్కనిచ్చు
మాతచదువెల్ల మననోటి ♦ గీత మనస.

4. అచ్యుతానంద గోవింద ♦ ఆది పురుష
సర్వభూతాంత విఖ్యాత ♦ సాధు పురుష

ముక్తినివ్వంగ జీవాత్మ ♦ మూలపురుష
గీతగీచిన మనగీత ♦ గీత మనస.

5. నీతినియమాలు నిక్కంబు ♦ నిలుపుటకును
పాపపనులను పట్టున ♦ బాపుటకును
దానధర్మాలు దండిగ ♦ దాల్పుటకును
గీతగీతలు చదువుము ♦ గీత మనస.

6. వేదవిద్యల వెలుగులు ♦ వెలితి గలిగె
ఋణము పడినాము దండిగ ♦ ఋషులయందు
ధర్మచింతన కఱువయ్యె ♦ ధరణియందు
గీతచింతన వీడకు ♦ గీత మనస.

7. సూర్యభగవాను డలనాడు ♦ సూటిగాను
మొదటిమొనగాడు సాధించె ♦ ముదముతోడ
అదియు వివరించి చూపించె ♦ అధికముగను
గీత ఆదిత్యవరమది ♦ గీత మనస.

8. పదియుయెన్మిది యోగాలు ♦ పట్టుగాను
వదలకుండిన యోగివై ♦ కదలకుండ
ఆత్మచింతన జేసిన ♦ అచ్యుతున్ని
నీతబోధువు నేర్పిన ♦ గీత మనస.

9. పార్థసారథి పలుకులు ♦ పలుకు మనస
పరమపురుషుని పాదాలు ♦ పట్టు మనస
సత్తుచిత్తుల చదువులు ♦ చదువు మనస
గీతగీతలు ముత్యాలు ♦ గీత మనస.

10. దీక్షబూనిన భ్రూమధ్య ♦ దివ్యజ్యోతి
మోక్షసామ్రాజ్య వెలుగుకు ♦ మొదటిజ్యోతి
వేదమంత్రాల వెంబడి ♦ వెలుగు జ్యోతి
గీతగీతలు రత్నాలు ♦ గీత మనస.

— రంగా చిన్నచలమయ్య.

# గీతా బోధ







రచన - పి. హనుమంతరెడ్డి,
(గుండ్లకొండ, పత్తికొండ తాలూకా.)

[శ్రీరెడ్డిగారు పాఠకులకు యీవరకె పరిచితులు. హుందాతనముతో బింకముగ సాగిపోవు వీరికవిత ఆంధ్రజాతీయతకు అద్దమువంటిది. విద్యావిజ్ఞాన సౌరభములతోనొప్పి వీరిజీవిత పుష్పము కలకాలము తెల్గుగడ్డను సుభాళింపజేయుగాక ! - సం॥]



అల విషాదమ్మునఁ గ్రిమ్మరిలెడు నరుల
తగు సమాధానమునఁదీర్చి త్యాగనిరతి,
నేత కుశలత పసలొల్కఁజేయు మెపుడు
వలదుదాసీనమని మాత్ర పలుకుఁగీత.

విశ్వకల్యాణ సుస్థిరాపేక్షఁజేసి
శాంతి నెలకొల్ప కాలానుసరణి నెఱిఁగి
నరుని కర్తవ్యమేమిటో? పరిగణించి
నడచుకొమ్మని బోధించు నదియె గీత.

రాగరోషాది వైషమ్య రోగములతో
రెచ్చిపోయినవారి నేరీతినైన
యోపి ప్రేమక్షమా శాంతి యుతులఁజేసి
సహజధర్మమ్ము నేర్పు నిశ్చయము గీత.

## ప్రకటన.

గీతాసాహిత్య ప్రచారమునకై అసమానమైన కృషిచేసే మా గీతావాణిపత్రికా కార్యాలయమునకు, భగవద్గీతకు సంబంధించిన వివిధ వాఙ్మయంతో పనిఉంది. ఈమహోద్యమమునకు సహాయపడుపుణ్యశీలురు ప్రస్తుతము లభ్యములు అలభ్యములునై యుండే గీతకుసంబంధించిన పుస్తకాలను మా కార్యాలయమునకు విరాళముగ నిచ్చినచో సాదరముగ స్వీకరించి వారిపేరును సవివరముగ పత్రికలో ప్రకటింతుము. పోస్టేజిని వారే భరించినసరే. లేదా, మా ఆఫీసుతరపున భరింతుము. ఉత్తరాలు క్రింది చిరునామాకు వ్రాయండి. సంపాదకుడు,

శ్రీగీతావాణి కార్యాలయము, ఆళ్ళగడ్డ, కర్నూలుజిల్లా.





# మతివలెనేగ

శ్రు॥ అంత్యే యా మతిస్సా గతిః.

(రచయిత: తాత్త్విక కవితావిశారద ఓ. నారాయణప్ప)

 

శ్రీదంబు శ్రే
యంబు శ్రీగీత యం
దున్న శ్రీకృష్ణ బో
ధంబు సాధించుభక్తాళి
కిన్ సాధ్యమున్ వేద్య
మున్ సంస్తుతిన్ బా
పుచున్ సద తిన్
జూపు నన్నాడు
గోపాలు డాక్రీడి
తోనిట్టు లంత్యాన
మర్త్యుండు జింతించు
చేరీతి దేహంబుఁ దా
బాయు నారీతి
బుఁ దాఁబొందుఁ గా
నెందు డెందంబు
నన్ దీని చందంబు
గుర్తించి ప్రాపంచ
మోహంబు లన్ బాసి యావేళ నా రూపు
భావించి నన్నర్థిఁ జింతించి నా తత్త్వ
మున్ గూడి నన్నేగ దున్ బొందు నద్దాన
నీవెప్డు నాభావ మూనంగ నౌనంచు బో
ధించె నద్దాని కైయొక్క యందంబు
చందంబు నన్నొప్పు సద్గాధ యొన్నొండు
వ్రాయన్ బ్రయత్నించి తిన్ దీన జిజ్ఞాసు
వుల్ చాల సంతృప్తి నొందంగ మున్నొక్క
కాలానఁ గాశీని వాసంబు గావించి
గంగాన దీతీర ప్రాంతాన నందొక్క
సన్న్యాసి తానెంతొ కాంతల్ ధనంబందుఁ



గాంతుల్ మదిన్ వీడి
సంతోష మున్
బ్రహ్మ చింతన్ మ
దిన్ గూడి భ్రాంతిన్
దగన్ వీడి చిన్నిష్ఠఁ
గాలంబుఁ దాఁబాపు
చుండంగ నాయోగి
నిన్ జేరి రొక్కర్రు
కొక్కండు నా
త్మార్థ మున్ బొందఁ
దారెంతో భక్తిన్ స
పర్యల్ వె సన్ గోరి
స్థానాంగ భావాత్మ
శుశ్రూష లన్ జేయ
సంతుష్టుడై మౌని
సచ్ఛిష్యు లన్ గూడి
సద్బోధ గావించి సత్యాత్మ రూపంబు
జక్కంగ బోధింప నారీతి గన్ వారుఁ
జిన్నిష్ఠ గావించు చున్ దేశి కున్ ప్రీతి
సేవించు చున్నంత నున్నట్టు లుండంగ నా
యమ్మ కున్ ఘోర హృద్రోగ మున్ గల్గ
నాయోగి తానంత నాశిష్యు రాఁబిల్చి
యాయమ్మ రోగంబు వృత్తాంత మున్ జెప్పి
యీబాల జీవింప దీవేళ వేగంబ నాచెట్టు
మూలాన నేయుంది రమ్మన్న నాతండు
నారీతి నాయమ్మ నున్ బాహు దండాల
నల్లెత్తి నాచెట్టు మూలాన దించంగఁ

జింతించె నాయమ్మ 'హా! జూడ మర్త్యుం
డు అందంబు గానుంటి స్పర్శింప దేహంబు
కాఠిన్య మైయొప్పుటన్ గాదె స్త్రీలెంతొ
కామోప భోగంబు లొందంగఁ గాంక్షింతు
రప్పూరు షున్ గూడి' యంచామె దేహోప
హానాన జింతింప నారీతిఁ దాఁబుట్టె
నాయింటి నందంత నాకాశిఁ
దొల్లింటి జన్మాన నాయమ్మ సద్భక్తి సద్దేశి
కున్ బూజ సల్పంగ నద్దానఁ బూర్వంబుఁ
దాగన్న జన్మంపు విజ్ఞాన ముండంగ
బ్రజ్ఞాన మెంతో మదిన్ గల్గి యేకాంత
మం దుండి శ్రీకాంతు ధ్యానించు చున్ గాల
మున్ బాపు చట్లుండ శిష్యుండుఁ దాభక్తి
సన్మౌనిఁ బూజించు చాత్మార్థ మేవేళ
ధ్యానించు చుండంగ నంతంత కామాని
కాయంబు జీర్ణించి వృద్ధాప్య కాలంబు
సిద్ధింప గానెంతొ శుద్ధాంత రంగాన
శుద్ధాత్మఁ దాగాంచి నిర్వాణ మొందంగ
నమ్మౌని శిష్యుండుఁ దాఁదేశి కస్థాన
ముందుండి భక్తాళి కిన్ ముక్తి మార్గంబు
బోధించు చుండంగ సద్భక్తు డైయొప్పు
చున్ మాది గొక్కండు సంభ్రాన నాసామి
కిన్ జెప్ప లుంజోడు నరదాన చందాన
డెందాన నొప్పంగఁ దాజేసి యర్పింప నా
సామి నవ్వానియం దెంతొ ప్రేమించి
చూడంగ నందాశ నానాటి కిన్ వృద్ధి
నొందంగ నాయున్న సేరంగఁ దానొక్క
రేయిన్ శరీరంబు నున్ బాయు కాలానఁ
జింతించెఁ దాఁజెప్ప లన్ బ్రేమ నద్దాన
నాసామి యమ్మాదిగింటిన్ ద గన్ వాని
పెండ్లాము గర్భంబు లోనుండ నాతల్లి
ఘోరంబు గాగల్గ నానొప్ప లన్ గుందు
చుండంగ నావార్త నాకాశి యందుండు
వారెల్ల విన్నంత నందేగు చుండంగ
నవ్వారి తోఁగూడి వేశ్యాంగ నాయింటఁ
దాఁబుట్టి పూర్వంపు జన్మంబు విజ్ఞాన
మున్ గల్గి యున్నట్టి యమ్మాయి యాసామి
ముందున్న జన్మంబు గుర్తించి యాయింట
గర్భస్థ మాబిడ్డ ప్రజ్ఞన్ గ్రహించంగ
బోధించె నోమూఢ! రా! రమ్ము!! రాకున్న
నీకింక స్త్రీహత్య వాటిల్లు నిద్దాన నేజన్మ
నీకబ్బునో చూడు రా! రమ్ము!! నీవింక
దూరమ్ము గావింపు మీరాగ మున్ ద్వేష
మున్ జిత్త మందీవు యాశాపి శాచాల
నాశంబు గావించి శ్రీవాసు దేవాత్మ
నీయాత్మ జింతించి కాలంబు బోజాడు
మంచామె జెప్పంగఁ దావచ్చె గర్భంబు
నందుండి యీభూమి కామీద నాతల్లి
యాతండ్రి సంతోష ముప్పొంగి సాకంగ
నబ్బాలు డారీతి నవ్వాని కాలున్ ప
దిన్ యేడు లాయెన్ త గన్ గాని యేరేరి
తోమాట లేవేవి యున్నాడ డెద్దాని
నిన్ ముట్ట డీరీతి నాతండుఁ జిన్నిష్ఠ యుం
డుండఁ జింతించె నీరీతి డెందంబు నన్
దండ్రి పుత్రుండు పెద్దయై నాకార్య
భారాల నొక్కింత సాయంబు తాజేయ
లేడొక్క యీరీతి మౌనంబుఁ దానొందె
నాకగ్మ నేమంచు గ్రామాంత రంబేనుఁ
గార్యంబు వేఁబొందు గల్గంగ బోనుండ
నీరేయి యీయూరు జాగ్రత్త గాగాఁచు
వారేరి నామూరు నంచిట్లు చింతించు నా
తండ్రి నిన్ జూచి యాతండ్రి నేనూరు
రేయంత నీమాటుఁ గాపాడి జాగ్రత్త
గాఁజూతు బొమ్మంచు నాపుత్రు డట్లున్న

నాతండ్రి యాశ్చర్యమున్ బొంది యానంద
మున్ జెంది హా! పుత్రు డీనాఁడు మాటాడె
నాతోడ నేధన్యు డంచెంచి నామీద
నాతండు గ్రామాంతరం బేగ నాతండుఁ
జేబట్టి దండంబుఁ జానంత పట్నంపు
నవ్వీధు లందందు సంచార మున్ జేయు
చీరీతి ముందొక్క ఘోషంబు నందిట్లు
జాగ్రత్త చెప్పంగ యత్నించె 'నోమాయ
లోకంబ! కామంబుఁ గ్రోధంబు లోభంబు
మోహంబు నానొప్పు షడ్వర్గ చోరాళి
జ్ఞానంబ నన్ జెల్లు మాణిక్య మున్ దొంగ
లించంగ దేహాన నున్నారు జాగ్రత్త
గానుండి కాపాడు డద్దాని నంచాత
డామంది కిన్ జెప్పె జాగ్రత్త! జాగ్రత్త!!
నాపత్తనం బేలు నారాజు నీమాట లాలించి
డెందాన యానంద మున్ బొందె నారెండు.
ఘోషము లందున్ వె సన్ వీధు లందొచ్చి
మర్త్యాళి కొప్పంగఁ జాఁబల్కె 'నోమాన
వాళి! వినన్నేను వాకొందు నాయాశ
పాశాలు బంధింప నీలోకు లల్లాడు
చున్నారు విశ్రాంతి యున్ లేకఁ జింతించు
చున్నారు సంతాప మున్ బొంది కర్మాలు
బంధింప ధర్మాదు లున్ లేక యజ్ఞాన
మున్ గూడి జాగ్రత్త! జాగ్రత్త!!' యంచాత
డట్లన్న నారేఁడుఁ దానెంచె విజ్ఞాని
యాతండు వేద్యుండ టంచున్ మదిన్నట్టె
ఆఘోషము లున్ మూడు నొప్పంగ నాతండు
పట్నాన బాజారు లన్ బోయి మర్త్యాళి
కీరీతిఁ దాఁజెప్పె నోమాయ లోకంబ!
లేదమ్మ! లేడప్ప యేబాంధ వుల్ లేరు
భ్రాతల్ మఱిన్ లేరు లేదిల్లు లేదాస్తి
జాగ్రత్త! జాగ్రత్త!! యంచాడు నాపల్కు
లాలించె నారేఁడు నామీదఁ దానాల్గు
నౌఘోషము డాయంగ నందందు నాపత్త
నంబందు సంచార మున్ జేసి మాటాడె
దుఃఖంబు జన్మంబు దుఃఖంబు వృద్ధత్వ
మున్ దుఃఖ సంసార మన్ వార్ధి మున్గంగ
బోనేల సద్బోధ సద్దేశి కున్ జేరి బొందంగ
జాగ్రత్త! జాగ్రత్త!! అంచిట్లు నాకయి
నాపట్న మున్ గాచి సూర్యోద యంబాట
చేనాత డున్ యిల్లుఁ జేరంగ నారేఁడుఁ
బిల్వంగఁ దాఁబంపె వేభృత్యు లన్నప్డు
యాపుణ్య చారిత్రు సవ్యార్త యాలించి
యాసామి తావచ్చె నారాజు యాస్థాన
రంగంబు జేరంగ రాజంత నా సామి
నిన్ జూచి దివ్యాస నంబిచ్చి కూర్చుండఁ
బ్రార్థించి యాయోగి వృత్తాంత మాద్యంత
మాలించి యుప్పొంగి డెందాన పాదమ్ము
లన్ బట్టి మోదంబు నన్ మ్రొక్కి దానంబుఁ
గొమ్మంచు ద్రవ్యాదు లీబోవ నేగోర
నెద్దాని నీభూమి నద్దాన జన్మాదు
లొప్పంగ సంసార మచ్చొత్తి నట్లుండు
యన్నట్టి యాయోగి సద్వాక్యముల్ రాజు
సత్యంబ టంచెంచి వైరాగ్య మున్ జెంది
విజ్ఞాన మున్ బొంది యాయోగి తత్త్వార్థ
మారేని కిన్ జెప్ప నారేఁడు ముక్తాత్ము
డైయొప్పె నామీద బ్రహ్మస్వ రూపంబు
భావించి భావించి యాయోగి తానంత
బ్రహ్మంబ యైయొప్పె దేహాంత కాలాన
శ్రీకృష్ణ రూపంబుఁ జిత్తంబు నన్నిల్పి
శ్రీకృష్ణు నిన్ భక్తిఁ జేరంగ నానంచు
బోధించు నీగీత నీరీతి భావంబు నంత్యాన
భద్రంబు గామాకు శ్రీకృష్ణ దేవుండుఁ
జేకూర్చి బ్రహ్మంబు గాఁజేయు గానెంచి

(మిగత 20_వ పుటలో)

శ్రీ గురుభ్యోనమః.

## గురువరేణ్యునకు శిష్యుని

# ★ నిజానుభూతి నివేదనము. ★

విద్వాన్ - కావ్యతీర్థ బ్రహ్మశ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
(కవితాసామ్రాజ్యము.)

★

[ బ్రహ్మశ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు విద్యావినయములుగల బ్రాహ్మణోత్తములు. సౌజన్య సముద్రులు. పోతన కవిత్వము నెడ వారికభిమానము మెండు. హృదయమును స్పందించుచు వెలువడెడి వారి కవితాగానమునకు రసజ్ఞలోకము తన్మయమై తీరును.

గీతాతత్త్వమునకు సంబంధించిన రచనలనే ప్రకటించవలెనని మాపద్ధు. కాని, కవిగారియెడకంటె వారి కవిత్వముపైగల పక్షపాతమును కాదనలేక దీనిని ప్రకటించుచున్నాము. మాకు నియమచ్యుతి దోషమాపాదింపని విధమున బ్రహ్మశ్రీవారు తమ మధుర సహకారమును ఈపై అందించగలరని మా ఆశ. — సం.]



మ॥ బహుకాలంబుగ సేవ సేయుటకు, సాఫల్యంబుగా మీ యను
గ్రహ మిప్పించి, నిజాత్మతత్త్వమును జక్కన్ బోధఁ జేయించి నం
చు హితార్థంబుగ నెంచుచుండ వెలి, లోఁ జూపట్టు నాస్వామి నేఁ
డహహా! కానఁగరాఁడె? యేమి గురువర్యా! మోసగాఁ డయ్యెనా?

శా॥ జ్ఞానప్రాప్తికిఁ గర్మ మూల మని జ్ఞానార్థంబు నిష్కామక
ర్మానుష్ఠానము చేయుచుంటకు ఫలం బైనట్లు మీరాకయున్
మీనిశ్చాయక బోధయున్ జరిగెఁ; గానీ, యింత తోడ్పడ్డ క
ర్మానుష్ఠానము సల్పువాఁడె; గురువర్యా! యిద్ది యే మయ్యెడిన్? ౨

మ॥ అలవాటొప్పఁగఁ దాము చెప్పినటు పిండాండంబు బ్రహ్మాండమం
దు లయింపింపఁగఁ జిత్రమయ్యెడిని! గుర్తుల్ పెట్టుకొన్నట్టి స్వా
ములు నాలోఁ బరమాణురూపులయి, ప్రాముఖ్యంబుగాఁ గొన్నితా
వులలో నిల్పిన నాదుశక్తినిధులై పొల్పారిరో దేశికా! ౩

మ॥ భరమై తోఁచిన దేహధారణము కల్పస్థాయిగా నుండినన్
భర మన్పించెడి బాధ దోఁపదు; ఘటప్రారబ్ధ మేరీతిగా
జరుగం దగ్గదొ యట్టులే జరుగు; సాక్షిన్నిర్వికారుండనై
పరగం గల్గిన నాకు, దానికిని సంబంధంబు లెట్లేర్పడున్? ౪

శా॥ మాయావాఁ డన్న మహానుభావుఁడు మహాత్మా! యిప్పు డేమైనవాఁ
డో వీక్షించితిరా? తదీయమగు మాయోద్వృత్తముల్ సూచి, పై
గా వేర్వేఱ విమర్శఁ జేసి తెలియంగానే యెటో మాయమై
యేవల్లన్ గనుపింపఁ; డెందుఁ గలఁడో! యీజోస్యముల్ జూడుఁడా!

మ॥ జడమై యుండియు నస్మదాశ్రయముతోఁ జైతన్యముల్ బొంది, తుం
డుడుకుల్ సేయు చభూతకల్పనల కుద్యోగింప, నద్దాన న
య్యోడు చిక్కుల్ గమనించి, వై దొలఁగి నే నేకాంతమం దుండఁ దా
బడుగై చిక్కె మనంబు!; చూచితిర అల్పవ్యక్తిదుర్మార్గముల్? ౬

శా॥ నాకన్నన్ మఱియొండు కానఁబడ దిన్నాళ్ళున్ బలెన్ దేవపూ
జాకల్పాదు లొనర్చుపట్లు; నభిషేచ ప్రార్థనా ధ్యాన పూ
జాకైంకర్యము లేవి చేసినను సాక్షీ దద్వితీయుండనౌ
నాకే చెందెడు; నేమి చిత్ర మిది? మాన్యా! బ్రహ్మవిద్వద్గురూ! ౭

(౧౮_వ పుట శేషము).

గీతామ హేమాత గీతామ హేకర్త గీతామ
హేభర్త లన్ శ్రీతి వర్ణించి సత్కీర్తి నీదండ
కం బేను నర్పింతు బ్రహ్మార్పణం బంచుఁ
బ్రార్థించి గొమ్మంచు భక్తిన్.

శ్లో॥ యం యం వాఽపి స్మరన్ భావం
త్యజత్యన్తే కళేబరమ్।
తం తమేవైతి కౌంతేయ
సదా తద్భావభావితః॥ 8 అ. 6

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు
మామనుస్మర యుధ్య చ।
మయ్యర్పితమనోబుద్ధి
ర్మామేవైష్యస్యసంశయః॥ 8 అ. 7

# శ్రీ భగవద్గీతా గేయము.

శ్రీ స్వామి సచ్చిదానంద భారతి



[1953 మార్చి సంచిక 29వ పేజి తరువాయి.]

కార్పణ్యదోషమున గల్గె నీభావంబు – ధర్మమేదో నాకు తగ దెల్పుమయ్య
శరణంచు నీకు నేసన్నుతు లొనరింతు – సందేహమును దీర్చు సర్వేశ! కృష్ణ
ఇంద్రియంబులను దహించుచుండిన యట్టి – గురువుల జంపుటలు క్రూరకర్మంబు
వలనగల్గిన పాపపరితాపమేరీతి – బాయునో తెలియకయె బహుచింతనొంది
సర్వసంపదలతో సమృద్ధమగు రాజ్య – మునుబొంది నను నింద్రభోగంబుగనిన
గాని నామదిలోన గల్గు దుఃఖంబెన్న – బాయు నుపాయంబు నే నెరుగ నైతి
అని యిట్లు తా బల్కి యర్జునుం డంతటను – యుద్ధంబు తామాని యూరకుండినను
అంతట కృష్ణుండు హాస్యరీతిగ బల్కె – అర్జునా వినుమంచు నతిమోదమునను
ఎవరికొరకై నీవు హెచ్చుగా దుఃఖంబు – బొందగూడదొ యట్టి పురుషులనుగూర్చి
భీష్మాదులనుగూర్చి పొందెద వీచింత – పాడిగాదిది నీకు ఫల్గుణా వినుము
పండితునిరీతిగను బల్కుచుంటివి గాని – ఆత్మనాత్మల నెరుగునట్టివారిట్లు
చచ్చినవారికై చావనివారికై – దుఃఖింపరెవ్వరును దోషంబటంచు
పార్థుడా నేగాని పగగ నీవును గాని – యీరాజులే గాని యెవరైనగాని
శాశ్వతులమేగాని చచ్చువారము గాము – జీవులు నిత్యులై స్థిరతనుందుదురు
ఆత్మరొక్కటియైన నదియె శరీరభే – దంబుచేత బహుత్వతను బొందుచుండు
నేరీతి జీవునకు నీదేహమందునను – బాల్యయవ్వనము కౌమారమును గలుగు
ఆరీతిజీవుండు యావరించును వేరు – దేహంబునందు నను దెలియుమా దీని
ఈవిషయంబునం దెట్టిపండితుడైన – మోహంబొకించుకయును పొందడెన్నండు
శ్రోత్రేంద్రియములతో శోభిల్లుశబ్దాది – విషయముల్ శీతోష్ణవివిధసుఖదుఃఖ
ములగూర్చుచున్నయవి బలుసార్లు వచ్చుచును – బోవుచుండెడి నిత్యభోగములె యివ్వి
వాటిని సహియించి వాపోవకుము నీవు – యిదియె జ్ఞానంబన్న నెరుగుమర్జునుడ
సుఖదుఃఖములయందు శోకమోహంబులను – యెవడుపొందడొ వాడె యేగు స్వర్గంబు
తత్త్వవేత్తలు సత్తు తమదేహమని నమ్మ – సత్తంచు నాత్మను సతతంబెరింగి
వసుధనెల్లెడలను వ్యాపించు నాత్మకు – నాశంబు లేదంచు నయముగా నెరిగి
ఎవ్వరైనను గాని యిట్టి యాత్మకు నాశ – నముగూర్పగా వేరు యనఘ వినుమయ్య
ఆత్మశాశ్వతము నాశమన్నదియే లేదు – అవినాశియని నీవు యరయుమా మదిని

ప్రత్యక్షమైనట్టి ప్రామాణ్యములచేత - తెలియతగినవాడు తెలియగలడయ్యా
నిత్యుడంచును నతడు ప్రత్యక్షముగ దాల్చు - దేహంబు నశియించు స్థిరముగాదద్ది
అర్జునా నీవింక నాలోచనము లేక - యుద్ధమొనరింపంగ సిద్ధంబుగమ్మా
ఎవ్వడీయాత్మ వధింపబడునని యెంచు - ఎవ్వడిద్దియె వధియించునంచనునో
వారుభయులుగూడ వ్యర్థ లజ్ఞానులు - కర్తృత్వమును గాని కర్మయే గాని
ఆత్మకు నీరెంటి నారోపణముజేసి - బ్రహ్మమెరుగనియట్టివారలే యగుదు
ఆత్మకు జన్మంబు నంతంబు లేదంచు - అర్జునా నీమది నరయుమా సతము
యీశరీరము నశియించిన మరియాత్మ - హతముగా దెన్నండు నదియె నిశ్చయము
అర్జునా యెవ్వడీయాత్మ నశించదని - నిశ్చయంబుగ నిద్ది నిత్యంబటంచు
జననక్షయములేనిదని యెంచుచున్నాడో - యెవనిచేతను గాని యెట్లునశియించు
గొవ్వానితానింక నెట్లు హతమొనరించు - నంచు యెరుంగుమా యది యసంభవము
చినిగినవస్త్రముల శీఘ్రముగా వీడి - క్రొత్తవస్త్రములెట్లు కోరిధరియించు
నారీతిగా నాత్మ నధికజీర్ణంబైన - దేహంబులను వీడి తిరిగి వెనువెంటె
క్రొత్తదేహంబులను కోరి దాల్చునుగాని - ఆత్మకెప్పుడు వికారంబు లేదయ్యా
ఆత్మనెన్నండైన యాయుధంబులు నరుక - జాలవు మదినమ్మ శంకనీకేల
అగ్ని దహియింపంగ నలవిగాదని నమ్మ - వాయు వెండింపంగ వలనుపడదయ్యా
నీళ్లు తడుపగలేవు నిశ్చయమిది నమ్మ - ఆత్మవస్తువు చూడ నతిచిత్రమయ్యా
ఆత్మనెప్పుడు నీవు యవినాశిగా నమ్మ - ఆద్యంతములులేక నలరారుచుండు
ఆత్మచలించనిది యది స్థిరరూపమై - యలరారు దుఃఖింపకయ్యా నీవింక
ఇంద్రియగోచరంబెన్నండుకాదాత్మ - కర్మేంద్రియములైన కడకుజేరవుగ
మనసు కగోచరము మదివిచారింపకుము - యిది వేదములయందు నెఱుగుబడునయ్యా
ఆత్మ బుట్టునటంచు నది నశించునటంచు - నీవు తలచినయెడల నిజముగా వినుము
దుఃఖింపవలసినది దోచదెద్దియు గాన - అర్జునా దుఃఖంబునందకుము నీవు
చావుపుట్టుకలును జన్మంబుగనుచుంట - అనివార్యమని యెంచుమర్జునా నీవు
దుఃఖింప పనిలేదు దురము జేయగలెమ్మ - పండితుండవుగాన భావ్యమనియెంచు
భూతములు ముందు నెట్టివో తెలియదు - ఇవి నశించినవెనుక నేమౌనో గాని
మధ్యకాలమునందు మనము గాంతుముగాని - విలపింపపనిలేదు వినుమయ్య పార్థ
ఆత్మవస్తువు కడునాశ్చర్యముగ జూచి - యదియె యాశ్చర్యముగ ననుమంద్రు గాని
ఆశ్చర్యమని దీని నాలకింతురుగాని - ఆత్మనెరిగినవార లవనిలో లేరు
దేహంబునశియింప దేహంబునందున్న - ఆత్మయెన్నడు కూడ హతము గాదయ్యా
కావున భీష్మాదికాయరూపములైన - స్వప్రకాశాత్మకై వలదు శోకింప
క్షత్రియోచితమైన సమరంబు వర్జించి - నీస్వధర్మంబిట్లు నీటముంచెదవె

(శేషము.)

# శ్రీ భగవద్గీతా సారము.

రచన: శ్రీ బి. వేంకటకవిగారు, కాకినాడ.

(గత సంచిక 29 వ పుట తరువాయి.)

## దశమాధ్యాయము — విభూతియోగము.

10. అంతటంతట నిమిడియుందును ।పార్థ। వింతవింతగ వెల్గుచుందును, అంతరంగముపర । చింతజేయుచునున్న, సంతుసద్గురువుల చెంతను జేరియు గంతువేసెడు వింతప్రకృతిని । నంతయును నావలనుద్రోసి । సంతసంబుగ బ్రహ్మమునుహృద । యాంతరంబున నిల్పుఫల్గుణ ॥

## ఏకాదశాధ్యాయము — విశ్వరూపసందర్శనయోగము.

11. జగమంతనేననియెంచుము ।నీలో। తగనాపోజ్యోతిని గాంచుము ॥ మిగులవిచిత్రము । లగు తరుగిరివృక్ష । ఖగపన్నగాదులు । సాగ సైన ఘనవింతలగుచువెల్గు పరాచరంబులు । జగతిరవిశశితారగణ ములు । నెగడుచుండును, మత్స్వరూపం । బగునునెరిగి భజించు మర్జున॥ ॥భగ॥

## ద్వాదశాధ్యాయము — భక్తియోగము.

12. పరమాత్మనగు నన్నుజూడుము ।పార్థ। దురితదుర్గుణములు వీడుము ॥ నిరతము సుజ్ఞానపరదృష్టియోగము । గురినిల్పిసాధించ గొప్పచిత్రంబులు అరయుబ్రహ్మ రుద్రగణములు । మిరుమిట్లులు రవిచంద్రకళలును । చరము అచరములగుచువెల్గుచు । పరమ పదవిని గాననగుజుమి. ॥భగ॥

## త్రయోదశాధ్యాయము — క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము.

13. తనువుక్షేత్రంబని యెరుగుము ।పార్థ। వినుక్షేత్రజ్ఞుడ నేనేడెలి యుము । ఘనమాయజగమందు । మనుజులెల్లప్పుడు । మనము సమత్వమెయనబడుజ్ఞానము । అనగ సర్వముబ్రహ్మమయమై । ఇనుడునంతట వెలుగునట్టుల తనువునంచున వెలుగుజేయుచు । తత్స్వరూపుడ నౌదుసాక్షిగ. ॥భగ॥

## చతుర్దశాధ్యాయము — గుణత్రయ విభాగయోగము.

14. సగుణనిర్గుణపరిపూర్ణము ।చూడ। జగమునందునజ్ఞానమూలము

త్రిగుణములాయెను తగసత్త్వరజ స్త | మగు తమోగుణములు |
మిగులరాగద్వేషమగును మోహామునగును దుఃఖము | విగత
ఫలమును సుఖముబొంది | పగయుమైత్రియులేనిభావము | నిగమ
వినుతుడ | వగుమునునుగని. ॥భగ॥

పంచదశాధ్యాయము — పురుషోత్తమ ప్రాప్తియోగము.

15. ధరణిలోసంసారవృక్షము |దాని| నెరుగుట నరులకుకష్టము ॥
అరయదిగువునవేళ్ళు| అరిషడ్వర్గంబులు | ఇరువదినాలుగుతత్వం |
బిరవై నకొమ్మలు | సరసముగ సంకల్పవికల్పము | లెరుగపూవులు
పిందెకాయలు | సరిగ ధర్మాధర్మఫలములు | స్థిరములై నశ్వత్థ
వృక్షము. ॥భగ॥

షోడశాధ్యాయము — దైవాసురసంపద్విభాగయోగము.

16. త్రివిధములగు ప్రకృతిజాలము |నిత్య| భవభయముల కను
కూలము ॥ అవిరళముగసత్య | పవమానశౌచము | దివిజయసుర
మాన | జీవహింసమాన॥ అవియు నపవర్గంబునరకము| లివియె
కామక్రోధలోభము| లవలద్రోసి భజించువారికి| సవినయంబుగ
బ్రహ్మపదమగు. ॥భగ॥

సప్తదశాధ్యాయము — శ్రద్ధాత్రయ విభాగయోగము.

17. భువిసత్వరజ స్తమగుణములు |బాగా| యవి నె న్న మూ డు
విధంబులు ॥ అవిరళముగసత్వ| యతిరాజసత్వ| దివిజరాజసత్వ
భవసత్వపిశాచ అవనిదానము తపముయజ్ఞము | లివియుభువి
ఓంతత్సదితియును భవవినాశనయజ్ఞతత్వ | మవలగనునను |
భవముజ్ఞానము. ॥భగ॥

అష్టాదశాధ్యాయము — మోక్షసంన్యాసయోగము.

18. కామవర్జనము సన్న్యాసము — త్యాగ | నేమముకర్మ వినాశము|
తామసభావమునేమి గనక జ్యోతి | ష్టోమాది కామ్యాకర్మల
నాచరింపక పామరత్వమువీడి మనమున | ప్రేమభావమునుంచి
నాపై| కామి తార్థము నే మనిష్ట | ధామమున మను
జేశ్చమనుచును. ॥భగ॥

# అనుభూతి పంచకము.

**మూలం: పూజ్యపాద శ్రీ శుద్ధచైతన్యజీ**

**అనువాదం:**

**కవికోకిల విద్వాన్ S. రాజగుప్తగారు**



అంతటను జ్ఞానమేయుండ సంతతంబు
ధ్యాతకెక్కడ చెప్పుమా! స్థలమరయఁగ,
ఎచట విజ్ఞానముండదో యెపుడు నిండి
యట్టిస్థలమును నాయనా! యరసిచెపుము.

ఉన్న తెలివియే నీవయై యుండనీకు
తెలివివేరెట్లు గల్గురా? తేల్చిచూడ,
సుఖమె నీవయైయుండఁగ శుద్ధరూప!
వేరుసుఖమెట్లు గల్గురా ? వెదకనీకు ౨

అద్భుతసుఖంబె నీవయై యునయుముండ
పరసుఖమునకై పాటులు పడెదవేల
ఉన్నసుఖమొంద యత్నింపకన్న! నీవు
తద్జ్ఞులనుజేరి తెలియుమా దానిసుద్ది. ౩

వృత్తిపుట్టకపూర్వము వృత్తిసంధి
యందు, మరి వృత్తిలయమును నొందునపుడు,
ఎట్టిభానువె భాసించు నెపుడునట్టి
యద్వయానందసాగరమనయమీవు. ౪

ఏయనుభవముచే నివియెల్ల మిథ్య
లనుభవాభాసములుగనె యనుభవింప
బడునో, యట్టి యా పరమానుభవమె యరయ
సత్యమగు ననుభవమోయి! స్వాత్మరూప! ౫

శుద్ధచైతన్య గురునిచే సులలితముగ
భక్తజనహితార్థము రచింపబడినట్టి
స్వానుభూతి పంచకమును నాంధ్రభాష
ననువదించితి సచ్చిత్సుఖార్థబుద్ధి. ౬

# పంచరత్నములు.

జాస్తి వేంకటనరసయ్యగారు, చిలకలూరిపేట.

గీ॥ గీత మానవకోటికి మాతయగుచు
భవ్యజీవితసందేశ భావమిచ్చు
గీతచదువుచు నరుడెప్డు పూతమైన
వర్తనంబున మెలగును వసుధయందు॥ 1

గీ॥ శాంతిసందేశమిచ్చును సత్యఫణితి
సంఘశ్రేయస్సుఁదెల్పును శశ్వదంబు
సేవధర్మంబుబోధించు శీఘ్రముగను
గీతవంటిగ్రంథములేదు భూతలమున॥ 2

గీ॥ ఆదిశంకర రామానుజాది గురులు
గాంధి అరవింద తిలకాది కర్మయోగు
లెన్ని భాష్యంబులోవ్రాసి సన్నుతముగ
గీతమర్మంబు చాటిరి ప్రీతిమీఱ॥ 3

కం॥ సత్యము శాంతము దయయును
అత్యంతముదంబుప్రేమ యమలగుణమ్ముల్
నిత్యము జనులకుఁ దెల్పుచు
స్తుత్యముగాబోచు 'గీత' సుజనులుమెచ్చన్॥ 4

కం॥ పాతకనాశిని గీతకు
పూతంబౌ వ్యాఖ్యయగుచు బొల్చెడిదానిన్
"గీతావాణి"ని జదివిన
చేతోమోదంబుగల్గు స్థిరముగనెపుడున్॥ 5

---

## గ్రంథస్వీకారము.

1. భక్తకన్నప్ప (హరికథ) కవి: శ్రీ కేశవతీర్థస్వాములవారు, శ్రీ రామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల పోస్టు, గుంటూరుజిల్లా. వెల రు. 0-8-0.

2. భగవద్గీత (బుర్రకథ) కవి: వారణాసి వెంకటనారాయణశాస్త్రి, మునగాల పోస్టు, కృష్ణాజిల్లా వెల రు. 1-0-0

కవి, తెలంగాణమున ప్రసిద్ధవ్యక్తులలో నొకడు. రచన ప్రతిభావంతముగ నున్నది. బహుముఖముల గీతాప్రచారము జరుగుచుండెడి యీ యుగమున వీరికృషి ప్రశంసింపదగినది.

ఓమ్
శ్రీరామచంద్రాయ నమః
శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః



# శ్రీ భగవద్గీత—
# సర్వరక్షక చింతామణి

శ్రీ కవిచక్రవర్తి, శతావధాని, విద్వాన్-
దోమా వెంకటస్వామిగుప్తగారు.

★

శా॥ గీతాచార్యుఁడు లోకరక్షకుఁడు శ్రీకృష్ణుండు విశ్వావన
ఖ్యాత శ్రీయుతుఁడై కిరీటికొకవత్సాకారముంగొల్పియున్
గీతాకారపయంబు లయ్యుపనిషన్నిర్దిష్ట భావంబులన్
గీతాంశుప్రభలొల్కు నందములవాసిందెల్పె గీతార్థముల్. 1

మ॥ భగవంతుండయి షడ్గుణైశ్వరతలంబర్వంబు ఖర్వేతరం
బుగనొప్పొందినవాసుదేవుఁడు జగన్మోహంబునుంబాప న
చ్చుగశుద్ధంబగు శేముషిం గొలుపసంశోధించి బోధించుటన్
భగవద్గీతలటన్న పేరునజగత్ప్రఖ్యాతి రాజిల్లెడిన్. 2

శా॥ గీతాతత్త్వ 'మిది'ట్లటంచనఁగ 'సంగీతప్రమోదంబునం
దీతాత్పర్య' మనంగ వాయుసుతుఁడే యెంతే సమర్థుండటం
చాతత్త్వజ్ఞుఁడు త్యాగరాజనియె నట్లాటన్ మఱెవ్వారు' ని
గ్గీతల్ తక్కువ యెక్కువంచనుచు నగ్గింపంగ శక్తాత్ములే. 3

శా॥ మాహాత్మ్యంబును దోడుచేసికొనియున్ మాధుర్యధుర్యత్వ స
ద్గేహంబేయగు సొంపుఁగూర్చు భగవద్గీతా విశేషంబులన్
శ్రీహార్యాత్మకుఁడైన గాంధిఘనుఁడే చెప్పెంగదా? యెట్టి సం
దేహంబెందుననున్నఁ దీర్పఁగల మేల్తీర్గల్గు నంచిమ్ముగన్. 4

ఉ॥ భాతిగవేల్కొలందిగను బర్వెను వ్యాఖ్యలు గీతలందు వి
స్ఫీతినిదెల్ప మాదృశులు చిన్నఁగఁగాని మఱెచ్చుగాని వి
ద్యాతతశక్తినొందని నరాళివచింపఁగ శక్యమొక్కొ శ్రీ
గీతలవైభవం? బగుటఁ గీల్కొనునియ్యవె మానసమ్ములన్. 5

సీ॥ మది ప్రశాంతంబుగాఁ బొదలనియప్పుడు
శ్రీ గాంధిమహితుండు చెలఁగియు భగ
వద్గీతఁ దెలువఁగఁ బరఁగ నందుంగను
పట్టుడిశ్లోకము భావము తన
యనుమానమునకుఁ సమాధానమై యొప్పు
నని యెన్నియో చోట్ల ననియెఁగాదె? .
లోకనియంతయై వీఁక నెసంగిన
బాపుజీమాటకుఁ బ్రతియుఁగలదె?
గీ॥ అట్టి శ్రీ గాంధిగౌరవాత్యంతపాత్ర
మయ్యె శ్రీభగవద్గీతయనఁగ నేఁడుఁ
గల్గు నవనాగరకులకుఁగాదె తృప్తి?
జగతి శ్రీ భగవద్గీత సర్వశుభము. 6

# వా ర లు.

మే నెల 30_వ తేది నుండి వారము దినములు మైసూరుసేటు కడూరు జిల్లా అజ్జంపూరు శ్రీశివానందాశ్రమమునందు శ్రీ శంకరానందస్వాములవారు భగవద్గీత యందలి పురుషోత్తమ ప్రాప్తియోగమును గూర్చి ప్రవచనము సల్పినారు.

3_6_54 నుండి 3 రోజులు, ప్రొద్దుటూరు నానా ఎరికలయ్యగారి శ్రీ కృష్ణ గీతాశ్రమముయొక్క అష్టమ వార్షికోత్సవ సందర్భములందు స్వామి శ్రీరామకృష్ణగారు భాగవతము ఏకాదశస్కంధమందలి అవధూతగీతనుగూర్చి ఉపన్యసించినారు.

5_6_54 నుండి హిందూపురమునందు జరుగవలసిన నూతన ఆశ్రమ ప్రవేశోత్సవ సప్తాహము కొన్ని అనివార్య పరిస్థితులతో ఆగిపోయినది.

17_6_54 నుండి 2_7_54 వ॥ పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లుగ్రామం శ్రీ క్షీర రామలింగేశ్వరాలయమునందు శ్రీ శంకరానందస్వాములవారిభగవద్గీతోపన్యాసములు జరిగినవి. శ్రీ స్వామి రామకృష్ణగారు తెలుగున అనువదించినారు. ఎగ్జిక్యూటివు ఆఫీసరుగారగు సి. రాజగోపాలరాజుగారి నిర్వాహకత్వముతో కార్యక్రమము మిక్కిలి రాణించినది. దేవాలయముయొక్క ఆవరణమునందు శబ్దవిస్తరణయంత్రముల ప్రభావముతో ఆశేషజనము కిటకిటలాడిపోయినది.

పాలకొల్లు కార్యక్రమానంతరము శ్రీ శంకరానంద రామకృష్ణుల పర్యటనము తూర్పు గోదావరిజిల్లాయందు జరుగగలదు. ఆ వివరములు రాబోవుపత్రికయందు ప్రకటింపబడగలవు.

శ్రీ

# ప్రబోధము.

## శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు.



సీ॥ అధ్యాత్మవిద్యాసుధాంబోధి మథియించు
స్వాములత్యాచార సారులైరి
స్వప్రజారక్షణాసక్తి ప్రాణములొగ్గు
రాజులు మూషకరాజులైరి
సార్వభౌములచేత స్వర్ణాభిషేకంబు
లందిన కవిరాజు లరులైరి
విద్రోహరక్తంబు వెల్లువల్ ఘట్టించు
వీరాగ్రణులు మూపకారులైరి.

గీ॥ ప్రకృతిశోభారమా విహారస్థలంబు
తెలుగునేల అభాగ్యులనిలయమయ్యె
ఈవిపర్యయ మెక్కనాడేని గాని
తలచి కన్నీరు విడుతువే తెలుగువాడ!

సీ॥ పలికించినారు శత్రులు తల్లడంబంద కత్తులపై వీరగాథ లెల్ల
చిలికించినారు చంచలచిత్తులకు ప్రీతి నుపనిషద్వాక్యపీయూష వృష్టి
వినిపించినారు దర్పిత పండితాళికి వీరాంక విజయభేరీరవంబు
గరపినారలు రాత్రికరకు గుండియలకు మందారమంజరీ మార్దవంబు

గీ॥ నింగి కెత్తించినారు నిర్నిద్రశౌర్య సాహసౌదార్య వినయరక్షాధ్వజంబు
పూర్వజాతీయ గౌరవాభ్యుదయమైన దలచి నడుము బిగింపవా? తెలుగువాడ!

సీ॥ కల్పసూత్రాగమ గ్రథితులాపస్తంబ బోధాయనాది తపోధికులును
బౌద్ధమహాయాన పంథాప్రవర్తకుం డాచార్యవరుడు నాగార్జునుండు
జైనబౌద్ధాగమ సమవర్తియై వేద మాన్యతజాటు కుమారిలుండు
అగణితసామ్రాజ్య నిగమభాష్యంబుల సమముగా దిద్దిన సాయణుండు

గీ॥ ఏమహాజ్యోతి నర్చించి ఇద్ధతేజు లగుచు విశ్వగురుస్థానమందినారొ ?
ఆమహాయోగమర్జించి ఆంధ్రులార దివ్యమహిమానుభూతి సాధింపరాదె !

గీ॥ బోధలను సేయు దేశికుల్ పోయినారు
బాధలనుగూర్చు గురువులు ప్రబలినారు
అవని మేధావులెందెందొ అణగినారు
మరల నీస్థితి గీతయే మార్చుగాక!

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తొమ్మండ్రు రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10 శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, ఎర్రగుంట్లపోస్టు.- 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోతేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్‌వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిదగనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.- 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ వడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం శేకవట్నం. కరీంనగర్ జిల్లా.

32 గ్రంథి వరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్పరాజుగారు, గోనపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. – 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. – 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. – 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, – కోయిలకుంట్ల. –15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం.

కడపజిల్లా. 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ – 17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. – 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 19. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. – 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. – 21. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. – 23. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. – 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. – 25. శ్రీ నటుకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 27. శ్రీ బుస్సెట్టి పన్నప్పగారు, ఉరవకొండ. – 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 30. శ్రీ కె. చాడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి. – 31. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తా॥ – 32. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 33. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 34. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. – 35. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. – 36. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. – 37. శ్రీ సాధు శివలింగప్ప గారు, కుందనగుర్తి. – 38. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 39. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 40. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. – 41. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

## గీతావాణి – పోషకవర్గము.

నెల్లూరు జిల్లా: 42. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము. కనుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 43. శ్రీ శంకరనాయుడుగారు, కారూరు.

మైసూర్ స్టేట్: 44. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 45. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 46. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 47. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 48. శ్రీ నారాయణమూర్తిగారు, c/o నూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. కోలారు. – 49. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 50. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. – 51. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. – 52. నాగబండి విశ్వనాథంగారు, 12/88 మైన్‌రోడ్డు, వరంగల్. – 53. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహభక్తమండలి, 12/245 గిర్మాజిపేట, వరంగల్ – 54. శ్రీ గంధె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణాదుకాణం, వరంగల్ – 55. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, కిరాణదుకాణం, వరంగల్ – 56. శ్రీతాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ – 57. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ – 58. శ్రీ మదూరు బసవలింగంగారు, వరంగల్ – 59. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ – 60. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ – 61. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు వరంగల్ – 62. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్‌గారు, కిరాణం మర్చంట్, వరంగల్ – 63. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. – 64 శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ – 65. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ – 66. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ – 67. శ్రీ చందా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ – 68. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు. వరంగల్ – 69. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 70. సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొల్లేగాలం.

కృష్ణాజిల్లా:– 71. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. 72. శ్రీ బావినేని రామకోటయ్యచౌదరి, పరమాత్మానందాశ్రమము, గీతాభవనము, పెనమలూరు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.
2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, పండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)






మూలము: విశ్వకవి రవీంద్రుడు.

అనుకరణ:

శ్రీ కొప్పరపు మల్లికార్జునరావు 'కళాశ్రీ'



తే॥ గీ॥ ఒక్క త్రుటికాలమైన నీయొద్దఁ గూరు
చుండఁ గుతుకంబుఁ గొనెదను; మెందుకొన్న
చేతిపనులొప్పఁ దరువాతఁ జేసి, యన్ని
ముగియఁ బొనరిచెదను మనస్ఫూర్తి మెఱయ.

తే॥ గీ॥ నీ మొకమునుండి చూపులనోము ముందు
నిలకవేరైన మనము నెవ్వలన శాంతి
విశ్రమముఁ గాంచదిఁకఁ బని; వేలలేని
యెడ తెగని పనిసంద్ర మల్లేఁ దలంతు.

ఉ॥ ఊదిన మేఁగు దెంచె మిడియెండ్లవేళను, గూడులోనికిన్
నాదమునిండి, నేల పడినన్ సుడిగాలులు మ్రోయునట్టులు
న్నాదముచేతఁ దుమ్మెదలు మానితగాయకులట్లుఁ బుప్పగు
ష్పాదగణీయపుంజమున జక్కని కొల్వువననున్న తీరునన్.

ఉ॥ మిన్నక మూగఁగాఁ దగుట మేలగు నిప్పుడు, నీ ముఖానికిన్
సన్నిధిఁ గూరుచుండి, మధుసాగముఁగా రచియించి పాటలన్
విన్నవమొప్ప జీవనము వేడుకనప్పనసేయ, నీ విరా
మోన్నతవేళఁ గ్రమ్ముకొనియుం దెరపిందన మొప్పపట్టునన్.

తే॥ గీ॥ ఈ చిఱుతపూవుఁ ద్రుంచి ధరింపు మీవ
యాలసింపక, నాథ భయంబుగదిరె;
నిద్ర తెగిపడి క్రింద, లయించు నేమొ
నేల మమ్మున నణువుగా నిలచునంచు.

ఉ॥ నీ మెడఁదాల్చు దామమున నిల్వఁగఁ దావెసగంగకున్న, నీ
ప్రేమను జేతితాకుడున వేవిలనందిన ముట్టి త్రెంచుకొ
మ్మా! మఱి నేనజాగృతిని మగ్నతనందక మున్నె, ప్రొద్దుతా
నా మెయి దాటిపోవునొ; ప్రయత్నముతోఁ బ్రణుతింపకాలనున్.

# ఆంధ్ర మహాజనులకు మా విజ్ఞప్తి.

పుణ్యమహాశయులారా !

భావనను పరిశోధించి, బుద్ధిని ప్రబోధించి, ప్రవృత్తిని పరిష్కరించి, మానవునకు సర్వతోముఖమగు ఆధ్యాత్మిక వికాసమును భగవద్గీత ప్రసాదించగలదు. భౌతికశక్తి ఊహాతీతమగు వికాసమును బొందిన యీ వైజ్ఞానిక యుగమున, ఆత్మశక్తి వికాసమును చేకూర్చెడి గీతాతత్త్వప్రసార ప్రచారములెంతేని అవసరము. ఈ రూపమున జనతాజనార్దనుని సేవించుటకై భగవంతునిపై భరోసాపెట్టి మా గీతావాణి బయలుదేరినది.

ఈ పత్రికకు మూడేండ్లుగడిచి నాల్గవయేడు పడినది. ఆర్థికముగ నెన్నో ఆఘాతముల నెదుర్కొనుచున్నది. వ్యాపార ప్రకటనలతో ద్రవ్యము నార్జించు పద్ధతి యీ ఉద్యమమునందు చేర్చదలంచలేదు. గడచిన మూడేండ్లకును మూడువేల రూపాయలు నష్టమేర్పడినది. డబ్బును మ్రింగుటలో పత్రికాఉద్యమము సురసాముఖమువంటిదని ఆ పరిచయముగలవారికి తెలియకపోదు.

మహనీయులారా! విశాలమగు తెలుగుగడ్డపై, విస్తారమగు తెలుగుభాషలో గీతాప్రచారమునకు ఏకైక పత్రికగావిలసిల్లు గీతావాణికి తగిన ఆదరాభిమానములు లేకుండుట మిగుల శోచనీయము. పత్రికలను అందుకొనుచుకూడ తమ చందాలను యింతవరకు పంపనివారుకూడ నున్నారు. మీరు చందాపంపుటెగాక, మీ మిత్రులను కూడ చందాదారులనుగ ప్రోత్సహించి చేర్పించండి. భోగప్రవృత్తిని, పశుజీవితమును ప్రోద్బలించెడి సంస్థలకు మీ ద్రవ్యము వ్యయమగుచునేయున్నది. యోగప్రవృత్తిని ఋషిజీవితమును ప్రోత్సహించెడి సత్సాహిత్యమునకు తృణమో — పణమో, మీవద్దలేదా! ఈ గీతాజ్ఞానయజ్ఞమున మీపాలిటి శ్రద్ధాహుతిని సమర్పించి శ్రీ కృష్ణదేవుని అనుగ్రహమునకు పాత్రులు కావలెనని సనిరోధముగ ప్రార్థించుచున్నాము.

— మేనేజరు, గీతావాణి.

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు, జూలై 1954 కా.1000.